గోలకొండపత్రిక

స్వభాను సం౹౹ర భాద్రపద బ౹౹ ౧౩ సోమవారము

# బ్రిటను యుద్ధ దినం

నిన్న, అనగా సెప్టెంబరు ౨౬ తేదీన మన హైదరాబాదులో, 'బ్రిటనుయుద్ధ' స్మరణ చేయబడినది. ఇదే రోజు ఈ స్మరణ భారతదేశమందు ఇతర ప్రదేశములలో కూడ జరుపబడినది. ఈ 'బ్రిటను యుద్ధ'మనిన నేమి, దీని స్మరణలో విశేషమేమి అను విషయములు పాఠకులు తెలిసికొనదగినవి.

'బ్రిటను యుద్ధము' అను మాటకు ౧౯౪౦ ఆగస్టు ౮ తేది మొదలుకొని అక్టోబరు ౩౧ తేదీవరకు బ్రిటనుపై జర్మనులు జరిపిన విమానాల దాడులు అని అర్థము. ఇట్టి విమానాల దాడులు పూర్వము క్రీ-శ- ౧౯౧౪ సంవత్సరమునుండి ౧౯౧౮ సంవత్సరమువరకు జరిగిన యూరోపా మహా సంగ్రామములో జరిగియుండ లేదా, ఇపుడు బ్రిటనుపై పైన నిర్దేశించిన కాలములో జరిగిన విమానాల దాడులను మాత్రమే గొప్పగా "బ్రిటను యుద్ధ"మని చెప్పుట ఎందువల్ల అని అడుగవచ్చును. పూర్వపు సంగ్రామములో జరిగిన విమానాల దాడులు ఇపుడు నిర్దిష్ట కాలములో బ్రిటనుపై జరిగిన విమానాల దాడులంత గొప్పవి కాకుండెను. పూర్వ యుద్ధములో ప్రధానమైనవి భూమిపై కాల్బలముల పోరాటములును, సముద్రముపై నౌకాబలములునై ఉండెను. అందుచే అక్కడక్కడ కొద్దికొద్దిగ మాత్రమే విమానముల పోరాటములు జరిగెను. నేటి మహా యుద్ధములో జర్మనులు ప్రారంభమున యూరపు ఖండపు మధ్యభాగమందలి పోలాండు మున్నగు దేశములను ఫ్రాన్సు మహాదేశమును జయించిన తర్వాత కూడ పోలాండు మెడపై చేయి వేసిన జర్మనీని ఓడించునంతవరకు వదలనని శపథమును మొదటనే చేసియుండిన బ్రిటను ఒంటరిగా చిక్కియు ధైర్యము వదలక ఆ శపథములను అప్పటికిని చెల్లించగలమని ఘోషించుచునే యుండుట జర్మనీకి పెద్ద కంటకముగా నుండెను. అందుకై జర్మనీ ఇక బ్రిటనును కాళ్ళబేరమునకు తెచ్చినగాని తాము సంపాదించిన రాజ్యములను నిల్పుకొనుటగాని, క్రొత్త రాజ్యములను గెలుచుటగాని సాధ్యము కాదని గ్రహించి యుండవచ్చును. కాని బ్రిటను సముద్రమందు పెద్దబలముగల దేశము. జర్మనీకి సముద్రముపై సేనలను నడిపించి యుద్ధము చేయగల శక్తి తక్కువ కనుక బ్రిటనను ఓడించుట ఎట్లు అని జర్మనీ యోచించి, బ్రిటను దేశములోని నౌకాశ్రయములను, విమానాశ్రయములను, యుద్ధపు సరకులను ఉత్పత్తి చేయు కర్మాగారములను విమానములనుండి బాంబులను వేసి ధ్వంసము చేసి, బ్రిటిషు జనుల యిండ్లపైనను, ఆ జనులపైనను బాంబులను, మరతుపాకుల గుండ్లను విమానాలనుండి వదలి నష్టములను కలిగించి బెదరుపెట్టి లొంగదీసి, ఆఖరుకు సముద్రముమీదుగా ఓడలలో బ్రిటను భూమిపై తమ కాల్బలములను దింపి యుద్ధము సాగించుచో విజయమును పొందవచ్చునుగదా యని తలచియుండును. అందుకే ౧౯౪౦ ఆగస్టు ౮ తేది మొదలుకొని అక్టోబరు ౩౧ తేదీవరకు జర్మను విమానాలు బ్రిటనుపై చాల ఘోరములైన దాడులను జరిపినవి. ఈ దాడులను గొప్ప దండయాత్రలనికూడ వర్ణించవచ్చును. ఎందుకనగా వందలకొలది జర్మను విమానాలు గంటకు వందమైళ్ళకుమించిన వేగముతో బ్రిటను దేశముకోని అనేక ప్రదేశములపై తిరిగి వందలకొలది బాంబులను వేసినవి. ఇట్లు పూర్వ మహా యుద్ధములో జరిగియుండ లేదు.

ఈ "బ్రిటను యుద్ధములో నాలుగు" విభాగములను చేయవచ్చును. ఆగస్టు ౮ నుండి ౧౮ తేదీవరకు ౧౧ రోజులలో ౨౬ దాడులు చేయబడినవి. అవి బ్రిటిషు నౌకలపైనను సముద్రతీర పట్టణములపైనను చేయబడినవి. ఇట్లు వచ్చిన విమానాలలోనుండి ౬౯౭ బ్రిటిషువారిచే నాశము చేయబడినవి. తర్వాత ఆగస్టు ౧౯ నుండి సెప్టెంబరు ౫ వరకు ౩౫ ప్రధానములైన దాడులు విమానాశ్రయములపైనను విమాననిర్మాణ కర్మాగారాలపైనను, జననివాసాలపైనను జరిగినవి. ఈ దాడులలో జర్మనులు ౫౬౨ విమానాలను నష్టపడిరి. సెప్టెంబరు ౬ నుండి అక్టోబరు ౫ వరకు జర్మను విమానాలు పరిశ్రమాలయముల మీదను, లండను పైదను ౩౮ పెద్ద దాడులను చేసినవి, జర్మనులు ౮౮౩ విమానములను కోల్పోయిరి. అక్టోబరు ౬ తేదినుండి ౩౧ తేదివరకు జరిగిన విమానాల దాడులలో లండను నగరముపై ఎక్కువగా దాడులు జరిగినవి. ఈ దాడులలో ౨౩౩ జర్మను విమానాలు ధ్వంసములైనవి.

మొత్తముమీద ఈ బ్రిటను యుద్ధములో మొదట అయిదు బ్రిటిషు నౌకలు ముంచివేయబడెను, మరి అయిదు చెడిపోయెను, బ్రిటిషు విమానాశ్రయములు చెడిపోయెను, అనేక పరిశ్రమాగారములలో ఉత్పత్తి కొద్దికాలము తగ్గెను, నౌకాశ్రయములు చాల చెడెను, వేలకొలది యిండ్లు చాలా చెడిపోయెను. పగటి దాడులలో ౧౭౦౦ మంది జనులు చచ్చిరి ౩౩౬౦ మంది గాయపడిరి. రాత్రి దాడులలో ౧౨౫౮౧ మంది చచ్చిరి ౧౬౭౮౫ మంది గాయపడిరి, ఇవి బ్రిటిషు వారికి కలిగిన కష్టములు.

జర్మనులవి ౨౩౭౫ విమానాలు పగటివేళ దాడులలో నాశము చేయబడినట్లు తెలిసినది. రాత్రివేళ దాడులలో జరిగిన జర్మను విమానాల నాశపులెక్క ఇందులో చేరలేదు.

ఇంత ఘోరమైన యుద్ధమునెదుర్కొనుచుకూడ బ్రిటిషువారు జర్మనీ ప్రారంభించిన యుద్ధమునకు మూలమైన హిట్లరు కూటమునంతయు నాశము చేయునది వదలమని నిలువబడి తుదకిపుడు ఆఫ్రికాలోనుండి విజయములను పొందుచు ఇటలీపైకూడ దండయాత్రను సాగించుచు ముందుకు సాగుచున్నారు.

విపత్తులో గుండె చెదరక, వివేకమును గోల్పోక నిలిచిన బ్రిటిషువారి ధైర్యమునకు ఫలితమిపుడు కనిపించుచున్నదని చెప్పవచ్చును. ఇటువంటి ఆదర్శమును ప్రపంచమునకు చూపించుచున్న "బ్రిటను యుద్ధ" స్మరణ లోకకళ్యాణముగ పరిణమించుగాక!

## సాహిత్య గోష్ఠి

(ఓ-వి-) హన్మకొండ, [illegible]

నిన్న స్వభాను భాద్రపద బ౹౹ ౧౦ ఆదివారము సాయంత్రము ౬ గంటలకు ఓరుగల్లునందలి కాకతీయ కళా సమితివారి కార్యాలయమున స్థానిక సమితి అధ్యక్షులగు శ్రీ భాస్కరలింగశాస్త్రిగారి ఆధిపత్యమున సాహిత్యగోష్ఠి జరిగెను. అందు శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారు "భాష మార్పులను గురించి" నన్నయభట్టు కాలమునుండి నేటివరకు భాష ఎట్లెట్లు మారుచువచ్చినది చూపుచు ఇప్పుడు ఇంకను మారుట అవసరమని ఉదాహరణముగా చెప్పించిరి. శ్రీ కొండపల్లి అంజయ్యగారు (స్థానిక సమితి సహాయకార్యదర్శి) "ప్రణయముగొప్పన" తమ పద్యగానము గావించిరి. శ్రీ రాజలింగముగారు తమ 'సాధన' అను ఏకాంక నాటికనుండి కొన్ని పంక్తులు చదివిరి. శ్రీ సోమయాజులవారు తమ "భారతమాత" గురించి వ్రాసిన పద్యములను పఠించిరి. మరియు శ్రీ పాములపర్తి సదాశివరావుగారు (కాకతీయ కళాసమితి కార్యదర్శి) తమ "మాధవశర్మ" అను చారిత్రాత్మక [illegible] నుండి కొంతభాగము వినిపించిరి. పిదప శ్రీ అధ్యక్షులవారు మన భాషాభివృద్ధికిగల ఆటంకములు వాటిని తొలగించు మన బాధ్యతలు ఎట్టివో బోధించిరి. రాబోవు పరీక్షయందు ప్రవేశింపదలచిన స్థానికాభ్యర్థులకు అభ్యాస సౌకర్యమునకుగాను సమితిపక్షమున తగిన సహాయము చేయుటకు శ్రీ అధ్యక్షులవారును, రాఘవరెడ్డిగారును ఒప్పుకొనిరి. ఇంతటితో సభ సమాప్తమయ్యెను.

## ఓరుగల్లుజిల్లా కమిటి సమావేశము

మానుకోట

ఓరుగల్లు జిల్లాకమిటీవారు మానుకోటలో సమావేశమయి యీ క్రింది అభిప్రాయములుగల తీర్మానముల చేసిరి.

౧ రాజకీయఖైదీల నెట్టిషరతులు లేకుండా వదలవలెను.

౨ కరీంనగరుజిల్లాలో నిర్బంధింపబడిన భూపతిరెడ్డిగారికి వైద్యసహాయమునకు అవకాశము కల్పింప సర్కారువారిని ప్రార్థింపనైనది.

౩ హైద్రాబాదు కాన్ఫరెన్సు ఎసోసియేషను వారు తమ నాల్గవ వార్షికోత్సవసందర్భమున చేసిన తీర్మానములోని ప్రభుత్వసభ ఏర్పాటును గురించిన భాగమును పరిశీలించి వారి వైఖరిని ఖండించుచు, స్థాయిసంఘమువారిని వెంటనే తమ అభిప్రాయమును తెలియచ్చ కోరనైనది.

౪ చౌకదుకాణముల పట్ల సర్కారువారి వైఖరిని మరింత విశాలపరచ అవసరమున్నట్లు తీర్మానించిరి.

౫ వైరా కైతులకషయమున చేసిన, బాకీల వసూలు ఆపుదలకై, సుబేదారు గారిని ప్రార్థించుచు, జిల్లామొత్తమునకుకూడా వైహాకములపంప కోరనైనది.

## వైదిక సేవాసంఘము.

(తిరుమలగిరిబజారు దక్కన్.) (ఓ.వి.)

వైదిక సేవాసంఘ ప్రథమవార్షికోత్సవము, స్థానికనివాసులైన శ్రీయుత, ఎస్,బి. బెనిగల్ గారి అధ్యక్షతలో జయప్రదముగా జరిగినది. మొదటిరోజున ఉ౹౹ ౧౦ గంటలకు పండిత మనోహర్ గారి వలన ధ్వజారోహణము పండిత మున్నాలాల్ మిశ్రాగారివలన మనోహరమైన భజనలు, రాత్రి ౧౦ గంటలనుండి ఘటికేశ్వర గురుకుల స్నాతకులైన బన్సీలాల్ వ్యాస్ గారి భజనలు, శ్రీ మాన్ డా౹౹ రామకృష్ణారెడ్డి వర్మ, పండిత మనోహర్ లాల్ వాస్య రత్నప్రస్, శ్యామారావు, స్వామినారాయణానంద, గారి ధర్మోపదేశములు జరిగెను మరుసటిదినము, పండిత ప్రేమచంద భజనలు, పండిత మనోహర్ లాల్ గారి ఉపన్యాసములు రాత్రి ౧౦ గంటల నుండి బాలికల ప్రార్థనలు, ప్రేమచందుగారి భజనలు, తేజాలచంద్ధీశ్వరయ్య పండిత మనోహర్ లాల్ శ్యామరావుగార్ల ఉపన్యాసములు, వైదిక సేవాసంఘ సంవత్సరప్రతిపొర్తు ఆదాయవ్యయములు చదువబడెను ఎల్. శ్యామరావుగారి ఉపన్యాసము ప్రతివాని [illegible] ఆలోచించవలెను. వైదిక సేవాసంఘాధ్యక్షులైన శ్రీ ఆకుల రాజయ్యగుప్తగారి అభివందనములతో వార్షికోత్సవము, జయప్రదముగా ముగించబడెను వైదిక సేవాసంఘసభ్యులచే యూతప్రశంసింపబడినది.

## బహిరంగలేఖ

నిజాంకళాశాల సంస్కృతాంధ్ర ఉపన్యాసకులగు బ్ర౹౹ కురుగంటి సీతారామయ్య గారికి

ఆర్యా, తాము రచించిన 'నవ్యసాహిత్యవీథులు, కథాత్రయి' అను పుస్తకములను నేడే చూచితిని. వీటిని విమర్శించుటకు ముందు నాకు కలిగిన సందియములను తమవలన తెలుసుకొనగోరి ఈ బహిరంగ లేఖను పంపుకొనుచున్నాను.

తమరు ఉపన్యసించగా ఇదివరలో వినియుంటిని. కాని తాము పై పుస్తకములలో వ్రాసిన భాషకును తమ వాక్కునకును సంబంధము కనుపించలేదు. తమరు వ్రాసిన భాష ఏ ప్రాంతమందైనను వ్యవహారములో నున్నట్టిది కాదు.

వ్యవహారభాషయందు మాటలను కొంత ఎచ్చటను వ్యవహారమునలేదు. గ్రాంథికమూ కాదు, నవ్యసాహిత్యవీథులలో చర్చింపబడినవారి భాష కూడ కాదు. జట్కావాలాలు సహితము వినియోగించని పదములు కూడా ఇందుకలవు. జిల్లాకొన్ని మాటలవంతుక చదువురానివారి మాటలను సేకరించి తమరు కొంతకూర్చి ఈ విధముగ వ్రాయుటకు కారణము బోధపడదు

తాము కళాశాలలో బోధపలగునంతటి స్థితికి వచ్చుట కిట్టి భాషయే తోడ్పడియుండెనా? ఇట్టి భాషను వ్రాసినదే తాము పరీక్షలలో నుత్తీర్ణులయితిరా? నేను తమకళాశాలలోని విద్యార్థులు ఇట్టి భాషను వ్రాసినచో పరీక్షలలో వారిని కృతార్థులనుగా జేయుదురా.

నవ్యసాహిత్యవీథులను హైదరాబాదు ఆంధ్ర సాహిత్యపరిషత్తు అను పేరు పెట్టుకొన్న వర్గము ప్రచురించినట్లుగలదు. హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్తు మగ్గురికొనున్నదనియును. పరిషత్సభ్యులు తాము, ఉస్మానియా యూనివర్సిటీ ఉపన్యాసకులగు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, జనాబు మ౹౹ ఖాసీంఖాన్ గారు అనియును తాము సెలవిచ్చియుంటిరి. ఇట్టి తమ గ్రంథములను ప్రచురించినది కాబట్టి దాని యాశయములుకూడ నట్టివేయని గ్రహించితిమి

తాము ముగ్గురును హైద్రాబాదు ప్రభుత్వముతో సంబంధముగలవారుగదా. ప్రభుత్వమువారిట్టి భాషనుఅంగీకరించిరా?

అంగీకరింపరిచో విద్యాశాఖలోనుండి తామిట్టి గ్రంథములు వ్రాయుట ఏమర్యాదపద్ధతి?

పద్య,పద, కవిత్వముచేత కాకపోయినను తోచినరీతి కేలము వచనములో వ్రాసినవారిని కూడ తాము సాహిత్యపరులని నిర్ణయించి యున్నారు. అట్టియెడ హైదరాబాదునందనేక సుప్రసిద్ధ రచయితలుండిరిగదా అట్టివారందరు తమ హైదరాబాదాంధ్రసాహిత్య పరిషత్సభ్యులేనా వారందరు తాము వ్రాసినభాష నంగీకరించినారా? ఒకవేళ తమముగ్గురికొరకు వై పరిషత్సభ ఏర్పడినచో అయ్యది హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్సభ ఎట్లగును, కాదేని హైదరాబాదు ఆంధ్ర సాహిత్యవేత్తలందరు తమరు వ్రాసిన పై గ్రంథములకు ఉత్తరవాదు లెట్లుకాగలరు.

కళాశాలలోను విశ్వవిద్యాలయములోను ఉపన్యాసకులు ఆయిన తాము ఇట్టి భాషలో గ్రంథములు వ్రాసినచో విద్యార్థులిట్టి భాషను వ్రాసినవారు పరీక్షలలో ఉత్తీర్ణులు కాజాలనప్పుడు వారిపట్ల తాము న్యాయము జేసినవారు కారా. ఆయ్యది మోసము కలిగించువట్టిది కాదా, నిత్యము తామిట్టి భాషలోనే విద్యార్థులకు బోధ జేయుచున్నారా? అపుడేలో మేమిసి నమాకట్టు మేయుదనిట్లు అధ్యాపకులయిన తామెట్లు వ్రాసిరయిక విద్యార్థుల స్థితియేమి,

హైద్రాబాదు, ప్రభుత్వము వారివలన పోషింపబడు బహుమ ప్రభుత్వము వారంగీకరించియుండని నిరుపయోగమైన భాషలో తాము ప్రచారము జేయుట ప్రభుత్వమువారిని మోసము జేయుట, విద్యార్థులకన్యాయము జేయుట కాదా.

మా యీ సంశయములను నివారణ జేయుచు తిరిగి ఈ పత్రికాముఖమున నే ప్రకటింప ప్రార్థన, తమ కట్టి ఆగ్రహము కలుగనిచో శ్రీ నిజాం ప్రభుత్వ విద్యాశాఖాధికారులను ప్రార్థించి వారివలననైనా తెలుసుకొనగలము. ఇట్లు

పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

౨౭. నల్లగుట్టబ్రాంచి సికిందరాబాదు.



## జపానును ఓడించబోవు వారలకు హెచ్చరిక

అమెరికను యుద్ధవిలేఖకుని రేడియో ఉపన్యాసము

యడ్గార్ స్నో అను అమెరికను యుద్ధవిలేఖకుడు సెప్టెంబరు ౧౫ తేదీన లండను బి-బి-సి బ్రాడ్ కాస్టు ఉపన్యాసములో జపానుతో యుద్ధము చేయబోవువారలకు కొన్ని హెచ్చరికలు చేసెను. నైఋతిపసిఫిక్ సముద్రములో మిత్రమండలివారికి కలిగిన విజయములను, ఇండియాలోను, చైనాలోను విమానాశ్రయముల సంఖ్య ఎక్కువయగుటయు ఇండియానుండి బర్మాలోనికి మోటారులకు బాటలు నిర్మించబడుచుండుటయు జపానుపై దండయాత్ర జరుపుటకు అనుకూలములైన విషయములేనని వారు మొదట చెప్పిరి. బర్మానుండి జపానీయులను తరిమివేసిన వెంటనే ఇండియాకు బర్మామీదుగా చైనాతో రోడ్డుసంబంధము మంచిస్థితికి రాగలదనిరి. కాని ఇప్పుడు ౧౯౪౧ లో కంటె జపాను ఎక్కువ బలము కలిగియున్నదనిరి. ఇంతవరకు నైఋతి పసిఫిక్ సముద్రములో మిత్రమండలికి కలిగిన విజయములు జపాను సరిహద్దులు దుర్బలతమముగనున్న ప్రదేశములయందే సాధించబడినవనిరి. ఇంకేగాక జపానువారు అపజయము తప్పించుకొనుటకై ఆఖరున తూర్పు ఆసియాలోని తమవలన రాజ్యముల ప్రజలందరికిని స్వాతంత్ర్యము నొసగవచ్చుననియు, అప్పుడు అమెరికనులు ఇంగ్లీయులును చతుర్విధాహామైన స్వాతంత్ర్యము తమ యుద్ధాశయమని ప్రకటించిన మాటలకు పరీక్షాసమయ మగుననియు స్నో గారు చెప్పిరి.

## అమెరికావారి క్రొత్త రహస్యాయుధము

అమెరికను విమానాలు ఇపుడు యూరపుఖండమందును, ఆసియాఖండమందును అక్షరాజ్యముల సేనలకు ముఖ్యములైన ప్రదేశములపై చేయుచున్న దాడులచే కలుగుచున్న విపరీతములైన నష్టములకు ఒక కారణము ఆ విమానాలలో ఇంతవరకును ఎవరెన్నెరిగియుండనట్టి క్రొత్త కపురహస్యమైన "ఆటోమాటిక్ పైలట్" ఏర్పాటు అని వైమానికాధికారులనుచున్నారు. ఆ ఏర్పాటుచే చాల ఎత్తునుండి క్రిందిలక్ష్యములమీదికి సరియైన గురిపెట్టి బాంబులను వేయుటకు వీలగుచున్నదట, (౧౪)

## బ్రిటిషుపక్షమునతోడ్పడుటకై ఇటాలీయులకు బడాగ్లియో ప్రబోధము

బడాగ్లియో గారి ఏసుర్యోనో భయమునకోని యుండెను ఇపుడు అతడు బ్రిటిషు మిత్రమండలి సేనలలో క్షేమముగానున్నట్లు సెప్టెంబరు ౧౭ తేదీన అల్జియర్సు రేడియోలో చెప్పబడినది.

బడాగ్లియో సెప్టెంబరు ౨౧ తేదీన అల్జియర్సు రేడియోలో ఇటాలీయు ప్రజలకు ప్రబోధము చేసెను. జర్మను సేనలు ఇటలీనంతయు బలాత్కారముగ ఆక్రమించుచున్నది. కాబట్టి ఇటాలీయులు గొరిల్లాయుద్ధముచే ఆ జర్మనులను ఇటలీనుండి తరిమివేయుటకు యత్నించవలెననియు, బ్రిటిషుమిత్రమండలివారు కూడ జర్మనులను ఇటలీనుండి తరిమివేయుటకు ప్రయత్నించుచున్నారు. గాన ఇటలీయులు వారలకు తోడ్పడవలెననియు, ఇటలీదేశమంతటను ఇటాలీయులు రాకపోకల సౌకర్యములను ధ్వంసము చేయవలెననియు, జర్మను సైనికులు ఎక్కడ కనిపించిన అక్కడ నెల్లవారలను పరిమార్చవలెననియు యుద్ధానంతరము బలిష్ఠమైన ఐకమత్యముగల ఇటలీ రాజ్యమును ఏర్పాటుచేయుటకు బ్రిటిషుమిత్రమండలివారితో కలిసిపనిచేయగలరనియు బడాగ్లియో చెప్పెను.

## యుగోస్లావియాలో భీషణమైన పోరాటము

యుగోస్లావియాలో దేశభక్తుల సేనలో కొ గ్రిజాతీకము పాడవ్వనను జర్మనుపక్ష సేనలను ప్రతిఘటించి భీషణముగా పోరాడుచున్నది. స్పూటారి సమీపంలో మూడుజర్మను "ఇ"బోటు నౌకలు ముంచివేయబడినవి క్రొయేషియనులు హెర్జెగోవినాలోని మెట్కోవిచ్ వరకు పోయినారు, సర్బియా, బల్గేరియాల మధ్యసరిహద్దుసమీపములో చాలా సేనలు జర్మను సేనలపై దెబ్బలను తీసినవి. వియనా, బుడపెస్టు, బెల్గ్రేడు, సోఫియా, సాలోనికా లను రాపోవు రైలుబాట గ్రీసులోని జర్మనుసేనలకు కావలసిన సామగ్రులను పంపుటకు పనికివచ్చును. ఆ బాటను అనేక స్థానములందు తెగగొట్టినారు. కాపాయీనా ప్రదేశమును ఆక్రమించినారు

